# నే నెవడను?

భగవాన్ శ్రీరమణమహర్షుల

ద్రవిడభాషాగ్రంథమునకు

**శ్రీ ప్రణవానందుల అనువాదము**

ప్రశ్నోత్తరరూపము

**శ్రీ రమణాశ్రమము**

తిరువణ్ణామలై - 606 603

**Nenevadanu?** (Telugu) (Questions & Answers form) (Translation of Bhagavan’s Tamil Book “Naan yaar”) Translated by Swami Pranavananda and Published by V.S. Ramanan, President, Sri Ramanasramam, Tiruvannamalai, Tamil Nadu 606 603
Email: ashram@sriramanamaharshi.org
Website: www.sriramanamaharshi.org



*17th Reprint 2008*
18th Reprint 2011 – 10,000 copies

CC. No 3018

**ISBN: 978-81-88225-60-6**

Price: ₹

*Printed by*
Sri Venkatesa Printing House
Chennai 600 026.

# మున్నుడి

వేదాంతసారమైన ఈ **'నే నెవడను?'** అను చిన్న గ్రంథము ముముక్షువులపై గల తమ అపారకరుణకు చిహ్నముగా భగవాన్ శ్రీరమణ మహర్షులు మొట్టమొదటగా చేసిన జ్ఞానోపదేశము.

శివప్రకాశంపిళ్ళై తత్త్వశాస్త్ర విద్యార్థిగా ఉండగా కొన్ని ప్రశ్నలు ఉద్భవించినవి. తరువాత వారు 1902వ సంవత్సరమున ఉద్యోగరీత్యా తిరువణ్ణామలై వచ్చినపుడు, 22 సంవత్సరముల వయసు కలిగి, బ్రాహ్మణస్వామిగా వ్యవహరింపబడుచున్న భగవాన్ రమణులను దర్శించుకుని తనకుగల సందేహములను ప్రశ్నల రూపమున వారి ముందుంచిరి. అపుడు మౌనముగా ఉన్న రమణులు కొన్ని ప్రశ్నలకు సంజ్ఞలద్వారా, కొన్నిటికి నేలపై వ్రాతమూలముగా, మరికొన్నిటికి కాగితములపై వ్రాసి వాటికి సమాధానములు ఇచ్చిరి.

ఈ ప్రశ్నలు–సమాధానములు 1923లో మొదటిసారిగా 'నే నెవడను?' అనే పేరుతో ముద్రింపబడినవి. సాధకులకు అందుబాటులో ఉండే విధంగా శ్రీరమణాశ్రమం ప్రస్తుతం ఈ చిన్న పుస్తకరూపంలో అందిస్తోంది. తరువాతికాలంలో శ్రీభగవానులే దీనిని గద్యరూపమున తమిళంలో నిర్మించగా శ్రీప్రణవానందులు దానిని తెనిగించారు.

– ప్రకాశకులు

ఓం నమో భగవతే శ్రీరమణాయ

# నే నెవడను?

సకలజీవులు దుఃఖం అనేది లేక ఎల్లప్పుడూ సుఖంగా ఉండాలని కోరుకుంటారు. ప్రతివ్యక్తికి తనయందే పరమప్రీతి ఉంటుంది. ప్రీతికి సుఖమే కారణం. మనస్సు అణగిన నిద్రలో ప్రతిదినము అనుభవించే తనకు స్వాభావికమైన సుఖాన్ని పొందాలంటే తనను తాను తెలుసుకోవాలి. దానికి **'నే నెవడను?'** అనే జ్ఞానవిచారమే ముఖ్యసాధనం.

## 1. నేను ఎవడను?

సప్తధాతువుల చేత ఏర్పడిన స్థూలదేహం నేను కాను. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలనే పంచ విషయాలను వేర్వేరుగా తెలుసుకొనే శ్రోత్ర (చెవి), త్వక్ (చర్మం), చక్షు (కన్ను), జిహ్వ (నాలుక), ఘ్రాణము (ముక్కు) లనే ఐదు జ్ఞానేంద్రియాలు నేను కాను. వచన, గమన, దాన, మలవిసర్జన,

ఆనందములనే ఐదు కార్యములు చేసే వాక్, పాద, పాణి, పాయు, ఉపస్థలనే ఐదు కర్మేంద్రియాలు నేను కాను. శ్వాస మొదలైన పంచవృత్తులు కల ప్రాణము మొదలైన పంచ వాయువులు నేను కాను. తలపోసే మనస్సు నేను కాను. సకల విషయాలను, సర్వ వృత్తులను వదలి విషయవాసనలతో మాత్రము కూడి ఉండే అజ్ఞానము (గాఢనిద్ర, సుషుప్తి) నేను కాను.

**2. పై చెప్పినవన్నియు 'నేను' గానిచో, అప్పుడు నేను ఎవడను?**

వీనినన్నిటిని కాదని ('నేతి చేసి'), ప్రత్యేకముగ నిలుచు ఎఱుకయే '**నేను**'.

**3. ఎఱుక స్వరూపమేమి?**

ఎఱుక స్వరూపము సచ్చిదానందము.

**4. స్వరూపదర్శన ప్రాప్తి ఎప్పుడగును.**

దృశ్యముగానున్న జగత్తు కనబడక పోయినప్పుడు ఆ దృక్కుయొక్క, అనగా స్వరూపముయొక్క దర్శనమగును.

**5. జగత్తున్నపుడు (చూడబడినప్పుడు) స్వరూప దర్శనము కాదా?**

కాదు.

**6. ఏల?**

దృక్కు–దృశ్యము, రజ్జు–సర్పమువలె నున్నవి. కల్పిత సర్పజ్ఞానము వదిలిపోతే గాని అధిష్ఠాన రజ్జుజ్ఞానము కలగదు. కాబట్టి, కల్పిత జగత్‌దృష్టి తొలగితే గాని అధిష్ఠాన స్వరూపదర్శనం లభించదు.

**7. దృశ్యమగుచున్న జగత్తెప్పుడు అణగును?**

సర్వవిషయ జ్ఞానములకు, సర్వవ్యాపారములకు కారణమగుచున్న మనస్సు అణగినప్పుడు జగము అంతర్ధానమగును.

**8. మనస్సు స్వరూపమేమి?**

మనస్సు ఆత్మస్వరూపంలో ఉన్న ఒక అతిశయ శక్తి. దానినుండియే అన్ని తలపులు తోచుచున్నవి. అన్ని తలపులను త్రోసివేసినపుడు మనస్సనేది వేఱుగా లేదు. కనుక తలపే మనస్సు స్వరూపము.

జగత్తనేది తలపులకన్న వేఱుగా లేదు. నిదురలో తలపులు లేవు. జగత్తు లేదు. జాగ్రత్తులోను స్వప్నములోను తలపులు కలవు; జగమును కలదు.

సాలెపురుగు తనలోంచే దారాలను బయటకు తీసి గూడు అల్లి మరల దానిని తనలోనికి తీసుకున్నట్లే మనస్సు తనలోంచి ప్రపంచాన్ని బయటకు నిర్మించి మరల తనలోనికి ఉపసంహరించుకుని మరుగు పరుస్తుంది.

మనస్సు ఆత్మనుంచి బహిర్ముఖం అయినపుడు (బయటకు వెడలునపుడు) ప్రపంచం తోస్తుంది. ఆ కారణంగా జగత్తు కనపడినపుడు స్వరూపం తోచదు. స్వరూపం ప్రకాశించినపుడు (అనుభవమైనపుడు) ప్రపంచం తోచదు.

మనస్సు తనదైన స్వరూపాన్ని విచారిస్తూ (అన్వేషిస్తూ) పోయినచో 'తానే' మనస్సు అయి తీరుతుంది. 'తాను' అనగా ఆత్మ స్వరూపమే. మనస్సు ఎపుడూ ఒక స్థూలవస్తువును ఆశ్రయించే ఉంటుంది.

అది ఒంటరిగా ఉండలేదు. మనస్సే సూక్ష్మ శరీరమని, జీవుడని చెప్పబడుతుంది.

**9. మనస్సు స్వరూపమును విమర్శించి తెలిసికొను మార్గమేమి?**

ఈ శరీరంలో " నేను" అని తోచేదే మనస్సు. నేను అనే తలపు దేహంలో ఎక్కడ మున్ముందుగా స్ఫురిస్తుందని విచారిస్తే హృదయంలో అని తెలుస్తుంది. అదే మనస్సు పుట్టుచోటు. "నేను నేను" అంటూ స్మరణ చేసినా అక్కడికే చేర్చుతుంది.

మనస్సుకు తోచే తలపులన్నింటిలో 'నేను' అనే తలపే మొదటిది. ఇది లేచిన తరువాతే ఇతరమైన తలపులు పుడుతుంటాయి. ఉత్తమపురుష "నేను" తోచిన తరువాతే మధ్యమ, ప్రథమ పురుషలు "నీవు", "వాడు" మొదలైనవి తోస్తున్నాయి. ఉత్తమ పురుష లేకపోతే మధ్యమ, ప్రథమ పురుషలు ఉండవు.

## 10. మనస్సు ఎట్లు అణగును?

"నే నెవడను" అనే విచారణ చేతనే మనస్సు అణిగేది. నేనెవడననే తలపు ఇతర ఆలోచనలను అన్నింటిని నాశంచేసి శవదహనంలో చితిని ముట్టించే కట్టెవలె తాను కూడా నశిస్తుంది. ఆ తర్వాత స్వరూప దర్శనమౌతుంది.

## 11. 'నేను ఎవడను' అను తలపును సదా అవలంబించి యుండుటకు ఉపాయమేమి?

ఇతర తలపులు ఎన్ని లేచినా వాటిని పూర్తి చేయుటకు ప్రయత్నించక "అవి కలిగినది ఎవరికి" అని విచారణ చేయవలెను. ఎన్ని తలపులు పుడితేనేం, జాగ్రత్తగా, ఒక్కొక్క తలంపు పుట్టగానే "ఇది ఎవరికి కలిగింది" అని విచారించాలి. "నాకు" అని తోస్తుంది. అప్పుడు నేనెవడనని శోధిస్తే మనస్సు తన పుట్టుక స్థానానికి మరలుతుంది. పుట్టిన తలపు కూడా అణగిపోతుంది. ఈ అభ్యాసం చేయగా, చేయగా మనస్సుకు తన జన్మస్థానంలో నిలిచి

ఉండే శక్తి అధికమౌతుంది. సూక్ష్మమైన మనస్సు, మెదడు, ఇంద్రియాల ద్వారా బయటికి పోవునపుడు స్థూలమైన నామరూపములు అనుభవమౌతాయి. మనస్సు స్వస్థానమైన హృదయంలో నిలకడ చెంది ఉండునపుడు నామరూపములు మరుగున పడుతున్నాయి. మనస్సును బయటకు పోనీయక హృదయాన నిలిపి ఉంచుటకే 'అహం ముఖము' లేక 'అంతర్ముఖము' అని పేరు. హృదయంనుంచి దానికి వెలుపలకి పోనిచ్చుటను 'బహిర్ముఖము' అంటారు.

ఈ విధంగా మనస్సు హృదయంలో కుదురు-కుంటే అన్ని తలపులకు మూలకారణమైన 'నేను' అనేది పోయి, సదా ఉండే 'తాను' మాత్రము తెలియబడుతుంది. ఏది చేసినను "నే" నను అహంకారము లేకయే చేయవలెను. ఆ విధముగ చేసినచో సర్వము శివస్వరూపముగ తోచును.

## 12. మనస్సణగుటకు వేరు ఉపాయములు లేవా?

మనస్సు అణగారుటకు విచారణ తప్ప వేరే మంచి ఉపాయాలు లేవు. ఒకవేళ ఇతర ఉపాయాల చేత అణగినా, మనస్సు కాసేపు అణగినట్లుండి, తిరిగి లేస్తుంది. ప్రాణాయామం చేత కూడా మనస్సు అణగుతుంది. అయితే ప్రాణం నిరోధమై ఉండేవరకు మనస్సు కూడా అణగి ఉండి, ప్రాణము మరల బయటకు కదిలేటప్పటికి మనస్సు కూడా బయటకు వచ్చి వాసనల వశంచేత అలసిపోతుంది. మనస్సుకు, ప్రాణానికి పుట్టుచోటు ఒక్కటే. తలపే మనస్సు స్వరూపం. నేననే తలపే మనస్సుయొక్క తొలి తలపు. అదే అహంకారము. అహంకారం ఎక్కడ పుడుతుందో అక్కడినుండే శ్వాస (ప్రాణము) బయలుదేరుతుంది. అందుచేత మనస్సు అణిగితే ప్రాణం, ప్రాణం అణిగితే మనస్సు పరస్పరంగా అణగుతుంటాయి. అయితే సుషుప్తిలో (నిద్ర) మనస్సు అణగినా ప్రాణం అణగుటలేదు. దేహరక్షణ కోసం, దేహం ఉన్నదో,

మరణించినదో అనే సందేహం కలగకుండా ఈశ్వరనియతి చేత ఈ విధంగా ఏర్పడినది. జాగ్రత్తు లోను, సమాధిలోను మనస్సు అణగినప్పుడు ప్రాణము కూడా అణగుతోంది. ప్రాణం అనేది మనస్సుయొక్క స్థూలరూపం. మరణకాలం దాకా మనస్సు ప్రాణాన్ని శరీరంలో నిలుపుకుని ఉండి, దేహం మరణించే సమయంలో దానిని కబళించుకుని (ఇముడ్చుకుని) పోవుచున్నది. కాబట్టి, ప్రాణాయామం మనస్సు లోబడుటకు సహకరిస్తుందే గాని నశింపచెయ్యదు.

ప్రాణాయామంలాగే మూర్తి (రూప) ధ్యానము, మంత్రజపము, ఆహారనియమము మొదలైనవి మనస్సును లొంగదీసేందుకు సహకారులే. మూర్తి ధ్యానంచేత, మంత్రజపం చేత మనస్సు ఏకాగ్రతను చెందుచున్నది. ఎల్లప్పుడూ చలిస్తూ ఉండే ఏనుగు తొండానికి ఒక ఇనుప గొలుసును అందిస్తే ఆ ఏనుగు వేరొకదానికై చూడక దానినే పట్టుకుని ఏవిధంగా పోతుందో, అదే విధంగా సదా సంచలించే

మనస్సును ఏదో ఒక నామంలోనో, రూపంలోనో అలవాటు చేసినచో దానిని గ్రహించి ఉంటుంది. మనస్సు అంతులేని తలపులుగా విస్తరించుట చేత ఒక్కొక్క తలపు అతి బలహీన మవుతుంది. తలపులు ఉడిగి క్షీణిస్తూ క్షీణిస్తూ, ఏకాగ్రస్థితిని పొందుటద్వారా మనస్సు శక్తివంతమై ఆత్మవిచారణ సులువుగా సిద్ధిస్తుంది. నియమాలన్నింటిలోనూ శ్రేష్ఠమైన మిత సాత్త్విక ఆహార నియతి చేత మనస్సు యొక్క సత్త్వగుణము పెంపొంది ఆత్మవిచారానికి సాయ-పడుతుంది.

**13. విషయవాసనలు (తలపులు) లెక్కకు మీఱి సముద్రములోని అలలవలె కనవచ్చుచున్నవి. అవి యెప్పుడు వీగిపోవును?**

చిరకాలంగా వచ్చే విషయవాసనలు (కోరికలు) సముద్ర తరంగాలవలె అనంతంగా ఉన్నప్పటికి, స్వరూపధ్యానము చేయగా చేయగా అవి అన్నీ నశిస్తాయి.

**14. వాసనలన్నీ అణగి కేవలం స్వరూపంగా ఉండుట సాధ్యమేనా?**

**'సాధ్యమా, కాదా' అనే సందేహానికి చోటీయక** స్వరూపధ్యానమునే ఎడతెగక కలిగి ఉండాలి. ఒకడు ఎంత పాపి అయినా సరే, "నేను పాపినే, ఎట్లా కడతేరడం?" అని వెక్కి, వెక్కి ఏడవక, 'నేను పాపిని' అనే తలపును పూర్తిగా పారద్రోలి స్వరూపధ్యానంలో దృఢమైన పట్టుదల కలవాడై ఉంటే, వాడు నిశ్చయంగా కడతేరగలడు.

మంచిమనస్సని, చెడ్డమనస్సని రెండు రకాల మనస్సులు లేవు. మనస్సు ఒక్కటే. వాసనలే శుభమని, అశుభమని రెండు రకాలు. మనస్సు శుభవాసనతో కూడి ఉంటే మంచిమనస్సని, అశుభవాసనలతో కూడి ఉంటే చెడ్డమనస్సని అంటారు. ఇతరులెంత దుర్మార్గులుగా కనిపించినా వారిని ద్వేషింపరాదు. రాగ, ద్వేషములు రెండూ విడువవలసినదే. ప్రపంచ విషయములందు మనస్సుని ఎక్కువగా ప్రసరింప

జేయరాదు. వీలైనంతవరకు ఇతరుల వ్యవహారంలో ప్రవేశించరాదు.

ఒకడు ఇతరులకు ఇచ్చేవన్నీ నిజానికి ఇచ్చుకునేది తనకే. ఈ సత్యం తెలిస్తే ఇతరులకు ఈయని వారెవరు?

'తాను' లేచినచో సమస్తము లేచును. 'తాను' అణగారినచో సకలము అణగిపోవును. మనము ఎంతెంతగా అణకువతో ప్రవర్తిస్తామో, అంతకు అంత మేలే అవుతుంది. మనస్సును వశపరచుకుంటే ఎక్కడైనా ఉండవచ్చు.

**15. విచారణ ఎంతవరకు ఆవశ్యకము?**

మనస్సులో ఎంతవరకు విషయవాసనలు మిగిలి ఉంటాయో అంతవరకు నేనెవడను? అనే విచారణ అవసరం. తలంపులు కలుగుతుంటే వానిని అక్కడికక్కడే (పుట్టినచోటే), అప్పటికప్పుడే విచారణ చేత నిర్మూలించాలి. ఇతరమైనదానిని ఆశించక పోవడమే వైరాగ్యం లేక నిరాశ. తనను తాను వదలక

పోవడం జ్ఞానం. నిజానికి వైరాగ్యం, జ్ఞానం రెండూ ఒకటే. ముత్యాలను సంపాదించేవాడు తన నడుముకు రాళ్ళను కట్టుకుని మునిగి, సముద్రగర్భంలో ఉండే ముత్యాలను సంపాదించే విధంగా ప్రతి ఒక్కడు వైరాగ్యాన్ని పూని, తనలో లోతుగా మునిగి, ఆత్మ ముత్యమును పొందవలెను. తన స్వరూపము నందేవరకు తాను నిరంతరం స్వరూప స్మరణము కలవాడైతే అది ఒక్కటే చాలు. కోటలోపల శత్రువులు ఉన్నంతవరకు బయటకు వస్తూనే ఉంటారు. ఎలా వచ్చినవారిని అలాగే చంపుతూ ఉన్నట్లైతే కడకు కోట వశం అవుతుంది.

**16. స్వరూప స్వభావమేమి?**

యథార్థముగ ఉన్నది ఆత్మస్వరూపం ఒక్కటే. జగజ్జీవేశ్వరులు ముత్యపుచిప్పలోని వెండివలె కల్పనామాత్రులే. ఈ ముగ్గురూ ఒక్కమారే తోచి ఒక్కమారే అదృశ్యమౌతారు. 'నే'నను తలంపు కించిత్తుకూడా లేని తానే స్వరూపము. అదియే మౌనం

అనబడుతుంది. స్వరూపమే జగము; స్వరూపమే నేను; స్వరూపమే యీశ్వరుడు. సకలము శివస్వరూపమే.

**17. సర్వమును ఈశ్వరకార్యమే కాదా?**

ఇచ్ఛ, సంకల్పము, ప్రయత్నము లేకనే ఉదయించు ఆదిత్యునియొక్క సన్నిధి మాత్రంచేత సూర్యకాంతపు రాయి అగ్నిని వెదజల్లుట, కమలములు వికసించుట, నీరు యింకిపోవుట, లోకంలో జనులు తమతమ పనులలో ప్రవర్తించి, కొనసాగించి, అణగిపోవుట; అయస్కాంత ప్రభావం చేత ఇనుపసూది కదలడం లాగ, సంకల్పమే లేని ఈశ్వరుని సన్నిధాన విశేషమాత్రము చేత నడచుకొనే మూడువృత్తులకు లేక పంచకృత్యములకు లోబడిన జీవులు తమతమ కర్మానుసారము చేష్టలు కలిగి – అనగా పనులను నెరవేర్చి – విశ్రమిస్తున్నారు. అయినను, ఈశ్వరుడు సంకల్పసహితుడు కాడు. ఏ కర్మా ఆయనను అంటదు. అది లోకకర్మలు సూర్యుని అంటనట్లు, చతుర్భూతముల గుణాగుణములు

వాటినంతటిని ఆవరించిన ఆకాశాన్ని అంటనట్లు ఉన్నది.

**18. భక్తులలో ఉత్తమ భక్తుడెవడు?**

స్వరూపమైన భగవంతునియందు ఎవడు తనను అర్పణము చేసికొనునో అతడే భక్తశ్రేష్ఠుడు.

ఆత్మచింతన తప్ప ఇతర చింతలు (ఆలోచనలు) పుట్టుటకు కొంచెమైన చోటీయక, ఆత్మనిష్ఠాపరుడై ఉండడమే తనను ఈశ్వరునికి అర్పించుకొనుట. ఈశ్వరునిపై ఎంత భారము వేసినా ఆయన దానిని భరించగలడు. సకల కార్యములను ఒక పరమేశ్వర శక్తి నడుపుచుండుట చేత మనం దానికి లోబడి ఉండడం మాని 'ఇలా చేయాలి, అలా చేయాలి' అని సదా చింతించుట ఎందుకు? రైలుబండి బరువు-లన్నిటిని మోయగలదని తెలిసియుండి ప్రయాణీకులైన మనము మన చిన్నమూటను కూడా అందులో పడవేసి సుఖంగా ఉండక దానిని నెత్తి కెత్తుకుని ఎందుకు కష్టపడాలి?

**19. వైరాగ్యమనునది యేమి?**

తలంపులు కలుగుతుంటే వానిని అక్కడికక్కడే (పుట్టినచోటే), అప్పటికప్పుడే విచారణచేత నశింపజేయుటయే వైరాగ్యము. మనస్సులో ఎంత వరకు విషయవాసనలు మిగిలి ఉంటాయెూ అంతవరకు నేనెవడను? అనే విచారణ అవసరం. ముత్యాలను సంపాదించేవాడు తన నడుముకు రాళ్ళను కట్టుకుని మునిగి సముద్రగర్భంలో ఉండే ముత్యాలను సంపాదించే విధంగా ప్రతిఒక్కడు వైరాగ్యాన్ని పూని తనలో లోతుగా మునిగి ఆత్మ ముత్యమును పొందవలెను.

**20. భగవంతునికి గాని, గురునికి గాని ఒక జీవుని ముక్తునిజేయ సాధ్యమా గాదా?**

ఈశ్వరుడు, గురువును ముక్తిచేరు మార్గమును జూపువారే గాని తామే జీవుణ్ణి ముక్తుని చేయువారు గారు. దేవుడు, గురుడు నిజానికి వేరు కారు. పులినోట పడిన ఆహారం ఎలా తిరిగిరాదో అలాగే

శ్రీగురుని కటాక్ష వీక్షణమున పడినవారు ఆయనచే రక్షింపబడుదురే కాని, ఎన్నటికీ విడువబడరు. అయినప్పటికి గురువు చూపిన మార్గాన్ని తప్పక అనుసరించవలెను. తన్ను తానే తన జ్ఞానచక్షువుచే చూచుకొనవలెను గాని ఇతరులద్వారా చూచుటెట్లు? రాముడు తన్ను రాముడను తెలిసికొనుటకు అద్దము కావలెనా!

## 21. ముక్తిని గోరువానికి తత్త్వముల విచారణ ఆవశ్యకమా?

ఊడ్చి పారవేయవలసిన చెత్తను పరీక్షించుట వలన ప్రయోజనం ఎలా లేదో, అలాగే తనను ఎరుగ వలసినవాడు తనను కప్పి ఉంచిన తత్త్వములను అన్నింటిని ప్రోగుచేసి పారవేయక, అవి ఇన్ని ఉన్నాయంటూ లెక్కలు కట్టుట చేతను, వాని గుణములను పరీక్షించుట చేతను లాభం లేదు. ప్రపంచాన్ని ఒక స్వప్నంగా భావించాలి.

**22. జాగ్రత్‌కు స్వప్నమునకు భేదము లేదా?**

జాగ్రత్ దీర్ఘము, స్వప్నం క్షణికము. అంతే తప్ప ఇంకే భేదం లేదు. జాగ్రత్తులో జరిగే వ్యవహారాలు అన్నీ ఎంత నిజమైనవిగా తోస్తున్నాయో, స్వప్నంలో జరిగే వ్యవహారాలు కూడా తత్ సమయానికి అంతే నిజమైనవిగా తోస్తాయి. స్వప్నంలో మనస్సు వేరొక శరీరాన్ని ధరిస్తుంది. జాగ్రత్ స్వప్నములు రెండింటిలోను తలపులు, నామరూపాలు ఏకకాలంలో కలుగుతున్నాయి.

**23. ముముక్షువులకు శాస్త్రాధ్యయనముచేత ప్రయోజన మున్నదా?**

ఏ శాస్త్రమైనా ముక్తినందుటకు మనస్సును అణచవలెనని చెప్పి ఉండడంచేత మనోనిగ్రహమే శాస్త్రముల యొక్క అత్యంత ముఖ్యసందేశమని తెలియును. అంతకుమించి శాస్త్రములను అంతు లేకుండా చదవడంవల్ల ఫలితం లేదు. మనోనిగ్రహానికి నేనెవడనని మనస్సులో విచారించాలే గాని,

శాస్త్రములలో విచారించుట ఎట్లు? తనను తాను తెలియుట తన జ్ఞాననేత్రం చేతనే కదా! రాముడు తనను రామునిగా ఎరుగుటకు అద్దము కావలెనా? 'తాను' ఉండేది పంచకోశములకు లోపల. మరి శాస్త్రములో, పంచకోశములకు వెలుపల. కనుక పంచకోశములను త్రోసిరాజని, విచారించి తెలియవలసిన తనను శాస్త్రములలో వెదకుట వ్యర్థమే. బంధములో ఉన్న తానెవరని విచారించి తన యథార్థ స్వరూపమును తెలియుటే ముక్తి. మనస్సును సదా ఆత్మలో నిలుపుటకే ఆత్మవిచారమని పేరు. ధ్యానమో, తనను సచ్చిదానంద బ్రహ్మమని భావించుట మాత్రమే. నేర్చుకున్నవాటిని అన్నింటిని ఒకప్పటికైనా మరచిపోవాలి.

**24. సుఖమనునది యేది?**

సుఖమంటే ఆత్మస్వరూపమే. సుఖం, ఆత్మ-స్వరూపం వేర్వేరు కావు. ఆత్మసుఖమొక్కటే ఉండేది. అదే సత్యం. ప్రాపంచిక వస్తువులలో ఒక్కదానిలో కూడా సుఖమనేది లేదు. వాటివల్ల సుఖం కలుగుతుందని మన

అవివేకంచేత అనుకుంటున్నాము. మనస్సు బహిర్ముఖం అయినప్పుడు దుఃఖాన్ని అనుభవిస్తుంది. యథార్థం ఏమంటే బాహ్యంలో మన కోరికలు తీరినప్పుడల్లా మనస్సు స్వస్థానానికి మరలివచ్చి ఆత్మసుఖాన్నే అనుభవిస్తోంది. అలాగే నిద్ర (సుషుప్తి), సమాధి, మూర్ఛ సమయాల్లోను, కోరిన వస్తువులు లభించినపుడు, ఇష్టంకానివారికి కష్టం కలిగినపుడు మనస్సు అంతర్ముఖమై ఆత్మసుఖాన్నే అనుభవిస్తోంది. ఈ విధంగా మనస్సు ఆత్మను విడిచి మాటిమాటికి బయటకు పోవుట, లోనికి మరలుట చేస్తూ అలసి పోతుంది. మహావృక్షపు నీడ చల్లగా సుఖంగా వుంది. బయట సూర్యుని తాపం క్రూరంగా ఉంది. ఈ ఎండవేడిమి దెబ్బతిన్నవాడు చెట్టునీడకు పోయి చల్లదనం ఆస్వాదిస్తున్నాడు. కొంతసేపయ్యాక మరల బయటకు వచ్చి గాలుపుదెబ్బ తింటూ మరల నీడకై పరుగెడుతున్నాడు. ఈ విధంగా నీడలోంచి ఎండలోనికి, ఎండలోంచి నీడలోనికి వచ్చి పోతున్నాడు. ఇలా

చేసేవాడు అవివేకి. వివేకి ఎన్నడూ నీడను వీడడు. అట్లే జ్ఞాని మనస్సు బ్రహ్మమును విడువదు. కాని అజ్ఞాని మనస్సు ప్రపంచంలో తిరుగాడుతూ క్లేశపడి, కొంతసేపు ఆత్మోన్ముఖమై తిరిగి సుఖాన్ని పొందుతుంటుంది. ప్రపంచమనేది తలపే. జగము మరుగులో – అనగా తలపులు లేనప్పుడు – మనస్సు ఆనందానుభూతి చెందుతుంది. జగము తోచునపుడు – అనగా తలపు లేవగనే – అది దుఃఖపడుతుంది.

**25. జ్ఞానదృష్టి యనగా నేమి?**

'నేను' అనే తోపకం కొంచెమైనా లేని స్థితియే స్వరూపం. అదే మౌనం. ఇలా ఊరకఉండుటకే జ్ఞానదృష్టి అని పేరు. ఊరకనే ఉండడం అంటే మనస్సును ఆత్మస్వరూపంలోనే లీనం చెయ్యడం. అంతేకానీ, ఇతరుల ఆలోచనలు తెలుసుకోవడం, మూడు కాలాల్లోని విషయాలు తెలుసుకోవడం, దూర ప్రాంతాలలో జరిగేవి తెలుసుకోవడం మొదలైనవి జ్ఞానదృష్టి అనిపించుకోదు.

**26. నిరాశకు జ్ఞానమునకు గల సంబంధమేమి?**

నిరాశయే జ్ఞానము. నిరాశ వేరు, జ్ఞానము వేరు గాదు. నిజానికి రెండూ ఒక్కటే. నిరాశ అనగా ఒక విషయముపైకి మనస్సు పోకుండుట. జ్ఞానమనగా ఒక్క విషయము కూడా తోచకుండుట. ఇతరాన్ని ఆశించకుండుట వైరాగ్యము లేక నిరాశ; తనను వదలకుండుట జ్ఞానము.

**27. విచారణకు ధ్యానమునకు భేదమేమి?**

మనస్సును తనయందే ఉంచుకొనుట విచారం అనబడుతుంది. తనను బ్రహ్మమని, సచ్చిదానందమని భావించుట ధ్యానమగును.

**28. ముక్తి యనగా నేమి?**

బంధములోనున్న **'తాను'** ఎవడని విచారించి తన యథార్థ స్వరూపమును తెలిసికొనుటే ముక్తి.

**శ్రీ రమణార్పణమస్తు.**